అథ ఏకోన వింశో%ధ్యాయః

దూర్వాసావతారము

నందీశ్వర ఉవాచ |

అథాన్యచ్చరితం శంభోశ్శృణు ప్రీత్యా మహామునే | యథా బభూవ దుర్వాసాశ్శంకరో ధర్మహేతవే || 1

బ్రహ్మపుత్రో బభూవాత్రిః తపస్వీ బ్రహ్మ విత్ర్పభుః |
అనసూయాపతిర్ధీమాన్ బ్రహ్మాజ్ఞాప్రతిపాలకః || 2

సునిర్దేశాద్ర్బహ్మణో హి సస్త్రీకః పుత్రకామ్యయా | స త్ర్యక్షకులనామానం య¸° చ తపసే గిరిమ్ || 3

ప్రాణానాయమ్య విధివన్ని ర్వింధ్యాతటినీ తటే | తపశ్చచార సుమహ దద్వం ద్వో%బ్ద శతం మునిః || 4

య ఏక ఈశ్వరః కశ్చి దవికారో మహాప్రభుః | స మే పుత్రవరం దద్యాదితి నిశ్చిత మానసః || 5

బహుకాలో వ్యతీయాయ తస్మింస్తపతి సత్తపః | ఆవిర్బభూవ తత్కాత్తు శుచిర్జ్వాలా మహీయసీ || 6

తయాసన్నిఖిలా లోకా దగ్ధప్రాయా మునీశ్వరాః | తథా సురర్షయస్సర్వే పీడితా వాసవాదయః || 7

నందీశ్వరుడిట్లు పలికెను-

ఓ మహర్షీ! శంభుని మరియొక గాథను కూడా ప్రీతితో వినుము. ధర్మము కొరకు శంకరుడే దుర్వాసుడై అవతరించిన గాథను చెప్పెదను (1). బ్రహ్మ కుమారుడు, తపశ్శాలి, బ్రహ్మవేత్త, సమర్థుడు, అనసూయకు భర్త, బుద్ధిశాలి, బ్రహ్మయొక్క ఆజ్ఞను పాలించు వాడు అగు అత్రి మహర్షి ఉండెను (2). ఆతడు బ్రహ్మగారి చక్కని ఆదేశమును పొంది భార్యతోగూడి, పుత్రులను బడయగోరి తపస్సును చేయుటకై త్ర్యక్ష కులమను పేరు గల

పర్వతమునకు వెళ్లెను (3). ఆ మహర్షి నిర్వింధ్యానదీ తీరము నందు ఒంటరిగా నుండి యథావిధిగా ప్రాణాయామమును చేసి వంద సంవత్సరములు గొప్ప తపస్సును చేసెను (4). అద్వితీయుడు, వర్ణింప శక్యము కానివాడు, మహాప్రభుడు అగు ఏ ఈశ్వరుడు గలడో, ఆ అవికారియగు శివుడే నాకు పుత్రుని పొందే వరమునీయవలెనని ఆతడు మనస్సులో నిశ్చయమును చేసుకొనెను (5). ఆతడు గొప్ప తపస్సును చేయుచుండగా చాల కాలము గడిచెను. ఆతని శిరస్సునుండి గొప్ప అగ్నిజ్వాల ఆవిర్భవించెను (6). దానిచే లోకములన్నియు దహింపబడుచుండెను. మహర్షులు, దేవర్షులు మరియు ఇంద్రాది దేవతలు అందరు దుఃఖమును పొందిరి (7).

అథ సర్వే వాస వాద్యా సురాశ్చ మునయో మునే | బ్రహ్మ స్థానం యయుశ్శీఘ్రం తజ్జ్వాలాతి ప్రపీదితాః || 8

నుత్వా నుత్వా విధిం దేవాస్తత్ స్వదుఃఖం న్యవేదయన్ | బ్రహ్మ సహ సురై స్తాత విష్ణులోకం యయావరమ్ || 9

తత్ర గత్వా రమానాథం నత్వా నుత్వా విధిస్సురైః | స్వదుఃఖం తత్సమాచ ఖ్యౌ విష్ణవే % నంతకం మునే || 10

విష్ణుశ్చ విధినా దేవై రుద్రస్థానం య ¸° ద్రుతమ్ | హరం ప్రణమ్య తత్రైత్య తుష్టావ పరమేశ్వరమ్ || 11

స్తుత్వా బహుతయా విష్ణుస్స్వదుఃఖం చ న్యవేదయత్ | శర్వం జ్వాలాసముద్భూత మత్రేశ్చ తపసః పరమ్ || 12

అథ తత్ర సమేతాస్తు బ్రహ్మ విష్ణు మహేశ్వరాః | మునే సంమత్రయాంచక్రురన్యోన్యం జగతాం హితమ్ || 13

తదా బ్రహ్మదయో దేవాస్త్రయస్తే వరదర్షభాః | జగ్మస్తదాశ్రమం శీఘ్రం వరం దాతుం తదర్షయే || 14

స్వ చిహ్న చిహ్నితాంస్తాన్ స దృష్ట్వాత్రిర్మునిసత్తమః | ప్రణనామ చ తుష్టావ వాగ్భిరిష్టా భిరాదరాత్ || 15

తతస్స విస్మితో విప్రస్తా నువాచ కృతాంజలిః | బ్రహ్మపుత్రో వినీతాత్మా బ్రహ్మ విష్ణు హరాభిధాన్ || 16

ఓ మహర్షీ! అపుడు ఇంద్రాది దేవతలు మరియు మునులు అందరు ఆ జ్వాలలచే మిక్కిలి పీడింపబడినవారై శీఘ్రముగా బ్రహ్మలోకమునకు వెళ్లిరి (8). వత్సా! దేవతలు బ్రహ్మను పలుమార్లు స్తుతించి ఆ తమ దుఃఖమును విన్నవించుకొనిరి. బ్రహ్మ దేవతలతో గూడి శీఘ్రముగా విష్ణులోకమునకు వెళ్లెను (9). బ్రహ్మ దేవతలతో గూడి అచటకు వెళ్లి లక్ష్మీపతియగు విష్ణువునకు నమస్కరించి స్తుతించి తమకు సంప్రాప్తమైన అంతము లేని దుఃఖము గూర్చి చెప్పెను (10). విష్ణువు బ్రహ్మతో మరియు దేవతలతో గూడి శీఘ్రమే రుద్రలోకమునకు వెళ్లి, పరమేశ్వరుడగు హరునకు నమస్కరించి స్తుతించెను (11). విష్ణువు శివుని పరిపరి విధముల స్తుతించి అత్రియొక్క తపస్సునుండి పుట్టిన జ్వాల వలన తమకు సంప్రాప్తమైన తీవ్రదుఃఖమును గురించి విన్నవించెను (12). ఓ మహర్షీ! అపుడచట బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సమకూడి జగత్తులకు హితమును చేయు విధమును గూర్చి ఒకరితోనొకరు సంప్రదించుకొనిరి (13). అపుడు వరముల నిచ్చుటలో శ్రేష్ఠులగు ఆ బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురు కలిసి ఆ మహర్షికి వరమునిచ్చుటకై శీఘ్రముగా ఆతని ఆశ్రమమునకు వెళ్లిరి (14). అత్రి మహర్షి తమ తమ చిహ్నములతో గూడియున్న ఆ త్రిమూర్తులను గాంచి ప్రణమిల్లి భక్తితో అభీష్టవచనములతో స్తుతించెను (15). అపుడు బ్రహ్మపుత్రుడగు ఆ మహర్షి ఆశ్చర్యచకితుడై చేతులు జోడించి వినయముతో నిండిన మనస్సుతో బ్రహ్మవిష్ణుమహేశ్వరులనుద్దేశించి ఇట్లు పలికెను (16).

అత్రిరువాచ |

హేబ్రహ్మన్ హే హరే రుద్ర పూజ్యాస్త్రి జగతాం మతాః | ప్రభవశ్చేశ్వరా సృష్టి రక్షా సంహార కారకాః || 17

ఏక ఏవ మయా ధ్యాత ఈశ్వరః పుత్రహేతవే | యః కశ్చి దీశ్వరః ఖ్యాతో జగతాం స్వస్తియా సహ || 18

యూయం త్రయస్సురాః కస్మాదాగతా వరదర్షభాః | ఏతన్మే సంశయం ఛిత్త్వా తతో దత్తేప్సితం వరమ్ || 19

ఇతి శ్రుత్వా వచస్తస్య ప్రత్యూచుస్తే సురాస్త్రయః | యాదృక్ కృతస్తే సంకల్ప స్త థైవాభూన్మునీశ్వర || 20

వయం త్రయో భ##వే శానాస్సమానా వరదర్షభాః | అస్మదంశభవాస్తస్మాద్భ విష్యంతి సుతాస్త్రయః || 21

విదితా భువనే సర్వే పిత్రోః కీర్తి వివర్ధనాః | ఇత్యుక్తాస్తే త్రయో దేవాస్స్వధామాని యయుర్ముదా || 22

వరం లబ్ధ్వా ముని స్సో %థ జగామ స్వాశ్రమం ముదా | యుతో% నసూయయా ప్రీతో బ్రహ్మానందప్రదో మునే || 23

అత్రి ఇట్లు పలికెను-

ఓ బ్రహ్మా! ఓ హరీ! రుద్రా! మీరు ముగ్గురు ముల్లోకములకు పూజనీయులు, సర్వసమర్థులగు ఈశ్వరులు, మరియు సృష్టిస్థితి సంహారములను చేయువారు (17). నేను పుత్రుని గోరి ఈశ్వరుని ఒకని మాత్రమే ధ్యానించితిని. లోకములలో ఈశ్వరుడను ఖ్యాతి పార్వతీసమేతుడగు శివునకు మాత్రమే గలదు (18). వరములనిచ్చుటలో శ్రేష్ఠులగు మీరు ముగ్గురు దేవతలు ఏల విచ్చేసిరి? నా ఈ సంశయమును పోగొట్టి, తరువాత నాకు అభీష్టమగు వరమునిండు (19). ఆతని ఈ మాటను విని వారు ముగ్గురు దేవులు ఇట్లు సమాధానమును చెప్పిరి. ఓ మహర్షీ! నీవు ఎట్లు సంకల్పించితివో, అటులనే అయినది (20). వరములనిచ్చు వారిలో శ్రేష్ఠులము, సంసారమునకు ఈశ్వరులము అగు మేము ముగ్గురము ఒక్కటియే. నీకు మా అంశలచే ముగ్గురు పుత్రులు జన్మించగలరు (21). వారు ముగ్గురు లోకములో ఖ్యాతిని గడించి, తల్లి దండ్రుల కీర్తిని వర్ధిల్ల జేయగలరు. ఆ ముగ్గురు దేవులు ఇట్లు పలికి ఆనందముతో తమ ధామములకు వెళ్లిరి (22). ఆ మహర్షి ఈ

విధముగా వరమును పొంది బ్రహ్మానందము ననుభవించెను. ఓ మహర్షీ! ఆతడు అనసూయతో గూడి ఆనందముతో తన ఆశ్రమమునకు వెళ్లెను (23).

అథ బ్రహ్మ హరిశ్శంభురవతే రుస్త్ర్సి యాం తతః | పుత్రరూపైః ప్రసన్నాత్మ నానాలీలా ప్రకాశకాః || 24

విధేరంశా ద్విధుర్జజ్ఞే%నసూయాయాం మునీశ్వరాత్ | ఆవిర్బభూవోదధితః క్షిప్తో దేవైస్స ఏవ హి || 25

విష్ణోరంశాత్ స్త్రియాం తస్యా మత్రేర్దత్తో వ్యజాయత | సన్న్యాస పద్ధతిర్యేన వర్ధితా పరమా మునే || 26

దుర్వాసా ముని శార్దూలశ్శివాంశాన్మునిసత్తమ | జజ్ఞే తస్యాం స్త్రియా మత్రేర్వ్వరధర్మప్రవర్తకః || 27

భూత్వా రుద్రశ్చ దుర్వాసా బ్రహ్మతేజోవివర్ధనః | చక్రే ధర్మపరీక్షాం చ బహూనాం స దయాపరః || 28

సూర్యవంశే సముత్పన్నో యో%ంబరీషో నృపో%భవత్ | తత్పరీక్షామకార్షీత్స తాం శృణు త్వం మునీశ్వర || 29

సోంబరీషో నృపవరస్సప్తద్వీపరసాపతిః | నియమం హి చకారాసావేకాదశ్యా వ్రతే దృఢమ్ || 30

తరువాత బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురు ప్రసన్నమగు అంతఃఖరణములు గలవారై వివిధలీలలను ప్రకటించుచూ అత్రి అనసూయలకు పుత్రులై అవతరించిరి (24). బ్రహ్మయొక్క అంశవలన చంద్రుడు అత్రి అనసూయలకు పుత్రుడై జన్మించెను దేవతలాతనిని సముద్రములో పారవేయగా, అచటనుండి మరల ఆవిర్భవించెను (25). విష్ణువుయొక్క అంశవలన అత్రి అనసూయలయందు దత్తుడు జన్మించెను. ఓ మహర్షీ! ఆ దత్తుడు సన్న్యాస పద్ధతిని వర్ధిల్ల జేసెను (26). ఓ మహర్షీ ! శివుని అంశవలన అత్రి అనసూయలకు దుర్వాసమహర్షి జన్మించి శ్రేష్ఠమగు ధర్మమును ప్రవర్తిల్ల జేసెను (27). దయానిధియగు ఆ

రుద్రుడు దుర్వాస మహర్షియై అవతరించి బ్రహ్మతేజస్సును వృద్ధి పొందింపజేయువాడై చాలమందియొక్క ధర్మనిష్ఠను పరీక్షించెను (28. ఓ మహర్షీ! ఆయన సూర్యవంశమునందు జన్మించిన అంబరీష మహారాజును పరీక్షించిన గాథను నీవు వినుము (29). సప్తద్వీపములతోగూడిన ఈ భూమినిఆ అంబరీషమహారాజు పాలించెడివాడు. ఆయన ఏకాదశీవ్రతమును దృఢముగా అనుష్ఠించుటకు నిర్ణయించు కొనెను (30).

ఏకాదశ్యా వ్రతం కృత్వా ద్వాదశ్యాం చైవ పారణామ్ | కరిష్యామీతి సుదృఢ సంకల్పస్తు నరాధిపః || 31

జ్ఞాత్వా తన్నియమం తస్య దుర్వాసా మునిసత్తమః | తదంతికం గతశ్శిష్యై#ుర్బహుభిశ్శంకారాంశజః || 32

పారణ  ద్వాదశీం స్వల్పాం జ్ఞాత్వా యావత్స భోజనమ్ | కర్తుం వ్యవస్థితస్తావదాగతం స న్యమంత్రయత్ || 33

తతస్స్నా నార్థమగమద్దుర్వాసా శ్శిష్యసంయుతః | విలంబం కృతవాంస్తత్ర పరీక్షార్థం మునిర్బహు || 34

ధర్మవిఘ్నం తదా జ్ఞాత్వా స నృపశ్శాస్త్రశాసనాత్ | జలం ప్రాశ్యాస్థితస్తత్ర తదాగమనకాంక్షయా || 35

ఏతస్మిన్నంతరే తత్ర దుర్వాసా మునిరాగతః | కృతాశనం నృపం జ్ఞాత్వా పరీక్షార్థం ధృతాకృతిః || 36

చుక్రోధాతి నృపే తస్మిన్ పరీక్షార్థం వృషస్య సః | ప్రోవాచ వచనం తూగ్రం స మునిశ్శంకరాంశజః || 37

ఏకాదశినాడు వ్రతము చేసి ద్వాదశినాడు పారణమును చేసెదనని ఆ మహారాజు దృఢముగా నిర్ణయించుకొనెను (31). ఆతని ఆ నియమమునెరింగి, శంకరుని అంశవలన జన్మించిన దూర్వాస మహర్షి చాలమంది శిష్యులతో గూడి ఆతని వద్దకు వెళ్లెను (32). పారణమునకు ద్వాదశీ తిథి అల్పకాలము మాత్రమే గలదని గ్రహించి ఆ మహారాజు భోజనము చేయబోవునంతలో విచ్చేసిన ఆ

మహర్షిని ఆయన భోజనమునకు ఆహ్వానించెను (33). అపుడు దుర్వాసుడుశిష్యులతో గూడి స్నానముకొరకు వెళ్లెను. ఆ మహర్షి రాజును పరీక్షించగోరి అచట చాల ఆలస్యము చేసెను (34). ఆ రాజు ధర్మమునకు విఘ్నము కలుగునని తలంచి శాస్త్రము యొక్క ఆదేశముననుసరించి నీటిని త్రాగి ఆ మహర్షి కొరకు ఎదురు చూచుచూ వేచియుండెను (35). పరీక్షకొరకు దేహమును దాల్చిన దూర్వాసుడు ఇంతలో అచటకు వచ్చి రాజు నీటిని త్రాగినాడని తెలుసుకొనెను (36). ధర్మపరీక్ష కొరకై శంకరుని అంశవలన జన్మించిన ఆ మహర్షి ఆ రాజుపై చాల కోపించి క్రూరమగు పలుకులను పలికెను (37).

దుర్వాసా ఉవాచ |

మాం నిమంత్ర్య నృపాభోజ్య జలం పీతం త్వయాధమ |
దర్శయామి ఫలం తస్య దుష్టదండధరో హ్యహమ్ || 38

ఇత్యుక్త్వా క్రోధతామ్రాక్షో నృపం దగ్ధుం సముద్యతః | సముత్త స్థౌ
ద్రుతం చక్రం తత్స్థంరక్షార్థమైశ్వరమ్ || 39

ప్రజజ్వాలాతి తం చక్రం మునిం దగ్ధుం సుదర్శనమ్ | శివరూపం
తమజ్ఞాత్వా శివమాయా విమోహితమ్ || 40

ఏతస్మిన్నంతరే వ్యోమవాణ్యువాచాశరీరిణీ | అంబరీషం
మహాత్మానం బ్రహ్మభక్తం చ వైష్ణవమ్ || 41

దుర్వాసుడిట్లు పలికెను-

ఓ రాజా! కలిసి భోజనము చేయుటకు నీవు దగవు. ఓయీఅధమా! నన్ను ఆహ్వానించి నాకు ఆహారమునీయకుండగా నీవు నీటిని త్రాగినావు. దాని ఫలమును నీకు చూపించెదను. దుష్టులకు శిక్షను విధించుటయే నా పని (38) ఇట్లు పలికి కోపముతో ఎర్రనైన కన్నులు గల వాడై ఆ మహర్షి రాజును దహించుటకు సిద్ధపడెను. వెంటనే రాజునందు ఉన్న ఈశ్వర స్వరూపమగు చక్రము రాజును రక్షించుట కొరకై సంసిద్ధ మయ్యెను (39). శివమాయచే వ్యామోహమును పొందియున్న ఆ సుదర్శన చక్రము ఆ

దూర్వాసుడు శివస్వరూపుడని యెరుంగక ఆయనను దహించుటకై ప్రజ్వరిల్లెను (40). ఇంతలో ఆకాశమునుండి అశరీరవాణి మహాత్ముడు, వేదభక్తుడు, మరియు వైష్ణవుడు అగు అంబరీషునితో నిట్లు పలికెను (41).

వ్యోమవాణ్యువాచ |

సుదర్శనమిదం చక్రం హరయే శంభునార్పితమ్ | శాంతం కురు ప్రజ్వలితమద్య దుర్వాససే నృప || 42

దుర్వాసోऽయం శివ స్సాక్షాద్యచ్చక్రం హరయే ऽర్పితమ్ | ఏనం సాధారణమునిం న జానీహి నృపోత్తమ || 43

తవ ధర్మ పరీక్షార్థ మాగతోऽయం మునీశ్వరః | శరణం యాహి తస్యాశు భవిష్యత్యన్యథా లయః || 44

ఆకాశాణి ఇట్లు పలికెను-

ఈ సుదర్శన చక్రమును శంభుడు హరునకిచ్చినాడు. ఓ రాజా! ఇప్పుడు దుర్వాసునిపై మంటలను గ్రక్కుచున్న ఈ చక్రమును శాంతింపజేయుము (42). ఈ దూర్వాసుడు సాక్షాత్తు శివస్వరూపుడు. ఈయనయే చక్రమును విష్ణువునకు ఇచ్చియున్నాడు. ఓ మహారాజా! ఈయన సాధారణమగు ముని యని తలంచకుము (43). ఈ మహర్షి నీ ధర్మమును పరీక్షించుటకు వచ్చినాడు. వెంటనే ఆతనిని శరణు వేడుము. లేనిచో, సర్వము వినాశము కాగలదు (44).

నందీశ్వర ఉవాచ|

ఇత్యుక్త్వా చ నభోవాణీ విరరామ మునీశ్వర | అస్తావీత్స హరాంశం తమంబరీషోऽపి చాదరాత్ || 45

నందీశ్వరుడిట్లు పలికెను-

ఓ మహర్షీ! ఆకాశవాణి ఇట్లు పలికి విరమించెను. అపుడా అంబరీషుడు శివుని అంశావతారమగు ఆయనను స్తుతించెను (45).

అంబరీష ఉవాచ |

యద్యస్తి దత్తమిష్టం చ స్వధర్మో వా స్వనుష్ఠితః | కులం నో విప్రదైవం చేద్ధరేరస్త్రం ప్రశామ్యతు || 46

యది నో భగవాన్ ప్రీతో మద్భక్తో భక్తవత్సలః | సుదర్శనమిదం చాస్త్రం ప్రశా మ్యతు విశేషతః || 47

అంబరీషుడిట్లు పలికెను -

నేను దానములను, యజ్ఞములను చేసియున్నచో, స్వధర్మమును అనుష్ఠించిన వాడనైనచో, మా కులము బ్రాహ్మణుని దైవముగా ఆరాధించినదైనచో, ఈ విష్ణువుయొక్క ఆయుధము శాంతించుగాక ! (46) భక్తవత్సలుడగు భగవానునకు నాయందు ప్రీతి యున్నచో, భక్తుడనైనచో, ఈ సుదర్శనాస్త్రము శీఘ్రమే చల్లారును గాక ! (47)

నందీశ్వర ఉవాచ |

ఇతి స్తువతి రుద్రాగ్రే శైవం చక్రం సుదర్శనమ్ | ఆశామ్యత్సర్వథా జ్ఞాత్వా తం శివాంశం సులబ్ధధీః || 48

అథాంబరీష స్స నృపః ప్రణనామ చ తం మునిమ్ | శివావతారం సంజ్ఞాయ స్వపరీక్షార్థమాగతమ్ || 49

సుప్రసన్నో బభూవాథ స మునిశ్శంకరాంశజః | భుక్త్వా తస్మై#ం వరం దత్త్వా స్వాభీష్టం స్వాలయం య¸° || 50

అంబరీష పరీక్షాయాం దుర్వాస శ్చరితం మునే | ప్రోక్త మన్యచ్చరిత్రం త్వం శృణు తస్య మునీశ్వర || 51

పునర్దాశరథేశ్చక్రే పరీక్షాం నియమేన వై | మునిరూపేణ కాలేన యః కృతో నియమో మునే || 52

తత్రైవ మునినా తేన సౌమిత్రిః ప్రేషితో హఠాత్ | తం తత్యాజ
ద్రుతం రామో బంధుం పణ వశాన్మునే || 53

సా కథా విహితా లోకే మునిభిర్బహు ధోదితా | నాతో మే
విస్తరాత్ప్రోక్తా జ్ఞాతా యత్సర్వథా బుధైః || 54

నందీశ్వరుడిట్లు పలికెను-

ఆతడు ఈ విధముగా రుద్రుని యెదుట స్తుతించగా సుదర్శనమనే ఆ శివచక్రము పూర్తిగా చల్లారెను. దుర్వాసుడు శివుని అంశయని యెరింగి పొందబడిన వివేకము గలవాడై (48), ఆ అంబరీషమహారాజు అపుడాయనకు నమస్కరించెను. తనను పరీక్షించుటకై శివుడే దుర్వాస రూపములో వచ్చియున్నాడని ఆ రాజునకు తెలిసెను (49). శంకరుని అంశవలన జన్మించిన ఆ మహర్షి అపుడు మిక్కిలి ప్రసన్నుడై భుజించి ఆతనికి వరమునిచ్చి యథేచ్ఛగా తన ఆశ్రమమునకు వెళ్లెను (50). ఓ మహర్షీ ! అంబరీష పరీక్ష యనే దుర్వాసవృత్తాంతమును నీవు వినియుంటివి. ఓ మునీశ్వరా! ఆ మహర్షి యొక్క మరియొక చరిత్రను కూడ నీవు వినుము (51). ఇంకనూ ఆయన శ్రీరాముని కూడ పరీక్షించెను. కాలుడు ముని రూపమును దాల్చి శ్రీరామునితో ఒక నియమమును చేసెను (52). అదే సమయములో ఆ మహర్షి పట్టుబట్టి లక్ష్మణుని ఆయన వద్దకు పంపెను. ఓ మహర్షీ ! వెంటనే శ్రీరాముడు శపథమును పాటించి సోదరుడగు లక్ష్మణుని పరిత్యజించెను (53). ఈ కథ లోకములో ప్రఖ్యాతముగా నున్నది. మహర్షులు దీనిని విస్తరముగా చెప్పియున్నారు. విద్వాంసులు అందరికీ తెలిసిన గాథ యగుటచే నేను వివరముగా చెప్పుట లేదు (54).

నియమం సుదృఢం దృష్ట్వా సుప్రసన్నో%భవన్మునిః | దుర్వాసా
స్సుప్రసన్నాత్మా వరం తస్మై#ృ ప్రదత్తవాన్ || 55

శ్రీకృష్ణ నియమస్యాపి పరీక్షాం స చకార హ | తాం శృణు త్వం
మునిశ్రేష్ఠ కథయామి కథాం చ తామ్ || 56

బ్రహ్మ ప్రార్థనయా విష్ణుర్వసుదేవసుతో%భవత్ |
ధరాభారావతారార్థం సాధూనాం రక్షణాయ చ || 57

హత్వా దుష్టాన్మహా పాపాన్ బ్రహ్మద్రోహకరాన్ ఖలాన్ | రరక్ష
నిఖిలాన్ సాధూన్ బ్రాహ్మణాన్ కృష్ణనామ భాక్ || 58

బ్రహ్మ భక్తిం చకారాతి స కృష్ణో వసుదేవజః | నిత్యం హి
భోజయామాస సురసాన్ బ్రాహ్మణాన్ బహూన్ || 59

బ్రహ్మభక్తో విశేషేణ కృష్ణ శ్చేతి ప్రథామగాత్ | సంద్రష్టు కామస్స
మునిః కృష్ణాంతిక మగాన్మనే || 60

రుక్మిణీ సహితం కృష్ణం మగ్నం కృత్వా రథే స్వయమ్ | సంయోజ్య
సంస్థితో వాహం సుప్రసన్న ఉవాహ తమ్ || 61

శ్రీరాముని మిక్కిలి దృఢమగు నియమమును గాంచి దుర్వాస మహర్షి మిక్కిలి ప్రసన్నుడై ఆయనకు వరము నిచ్చియుండెను (55). ఆ మహర్షి శ్రీకృష్ణుని నియమమును కూడ పరీక్షించెను. ఓ మహర్షీ! ఆ కథను చెప్పెదను వినుము (56). భూభారమును తగ్గించి సాధువులను రక్షించుట కొరకై బ్రహ్మ యొక్క ప్రార్థనమేరకు విష్ణువు వసుదేవుని కుమారుడై అవతరించెను (57). ఆయన కృష్ణుడను పేరుతో విఖ్యాతిని గాంచి మహాపాపులు వేదద్రోహమును చేయువారు అగు దుష్టులను సంహరించి సమస్త సాధువులను, బ్రాహ్మణులనురక్షించెను (59). వసుదేవుని కుమారుడగు ఆ శ్రీకృష్ణుడు బ్రాహ్మణులయందు అధికమగు భక్తిని కలిగియుండెను. ఆయన నిత్యము అనేక మంది బ్రాహ్మణులకు రుచ్యములగు పదార్థములతో భోజనమునిడెను (59). శ్రీకృష్ణుడు గొప్ప బ్రాహ్మణ భక్తుడని కీర్తిని గాంచెను. ఓ మహర్షీ! ఆ మహర్షి శ్రీకృష్ణుని దర్శించుటకై ఆయన వద్దకు వెళ్లెను (60). రుక్మిణీ సమేతుడగు శ్రీకృష్ణుని ఆయన స్వయముగా రథము నెక్కించి మిక్కిలి ప్రసన్నమగు మనస్సు గలవాడై ఆ రథమునకు గుర్రమును పూన్చి స్వయముగా నడిపించెను (61) (?)

మునీ రథాత్సముత్తీర్య దృష్ట్వా తాం దృఢతాం పరామ్ | తస్మై#్మై
భూత్యా సుప్రసన్నో వజ్రాంగత్వవరం దదౌ || 62

ద్యునద్యామేకదా స్నానం కుర్వన్నగ్నో బభూవ హ |
లజ్జితో%భూన్మునిశ్రేష్ఠో దుర్వాసాః కౌతుకీ మునే || 63

తద్ జ్ఞాత్వా ద్రౌపదీ స్నానం కుర్వతీ తత్ర చాదరాత్ | తల్లజ్జాం
ఛాదయామాస భిన్న స్వాంచలదానతః|| 64

తదాదాయ ప్రవాహేనాగతం స్వనికటం మునిః | తేనాచ్ఛాద్య
స్వగుహ్యం చ తస్మై#్య తుష్టో బభూవ సః || 65

ద్రౌపద్యై చ వరం ప్రాదాత్తదంచల వివర్ధనమ్ | పాండవాన్
సుఖినశ్చక్రే ద్రౌపదీం తద్వరాత్పునః || 66

హంసడింభౌ నృపౌ కౌచిత్ స్వావమానకరౌ ఖలౌ | దత్త్వా నిదేశం చ
హరే ర్నాశయామాస స ప్రభుః || 67

బ్రహ్మతేజో విశేషేణ స్థాపయామాస భూతలే | సన్న్యాసపద్ధతిం చైవ
యథా శాస్త్ర విధి క్రమమ్ || 68

ఆ మహర్షి రథమునుండి దిగి శ్రీకృష్ణుని శ్రేష్ఠమగు దృఢవ్రతత్వమున గాంచి మిక్కిలి ప్రసన్నమగు మనస్సు గలవాడై ఆయనకు సంపదతో బాటు వజ్రము వలె దృఢమగు దేహమును వరముగా నిచ్చెను (62). ఆయన ఒకనాడు గంగానదిలో స్నానము చేయుచుండగా వస్త్రము కొట్టుకు పోయెను. ఓ మహర్షీ! అపుడా దుర్వాస మహర్షి సిగ్గుపడి ఉత్కంఠతో ఇటునటు చూచెను (63). సమీపములో స్నానము చేయుచున్న ద్రౌపది విషయమును గ్రహించి తన వస్త్రమును చింపి ఆ శకలమును ఆదరముతో ఆయనకు ఇచ్చి పరువును కాపాడెను (64). ప్రవాహ వేగముచే తన వద్దకు వచ్చిన వస్త్ర శకలమును స్వీకరించి ఆ మహర్షి దానిని ధరించి ఆమెయందు మిక్కిలి ప్రసన్నుడాయెను (65). ఆయన ద్రౌపదికి వస్త్ర వృద్ధియను వరమునిచ్చి, ఆ వరప్రభావముచే ద్రౌపదికి మరియు పాండవులకు సుఖము కలుగునట్లు చేసెను (66). సమర్థుడగు ఆ మహర్షి విష్ణువును ఆదేశించి, రెండు హంసల

పిల్లల రూపములో తనను అవమానించిన దుష్టులగు ఇద్దరు రాజులను మట్టుపెట్టెను (67). ఆయన తన బ్రహ్మతేజస్సు యొక్క మహిమచే భూలోకమునందు యథాశాస్త్రముగా కర్మలను చేయుక్రమమును, మరియు సన్న్యాస పద్ధతిని కూడ ప్రవేశ##పెట్టెను (68).

బహూనుద్ధారయామాస సూపదేశం విబోధ్య చ | జ్ఞానం దత్త్వా విశేషేణ బహూన్ ముక్తాంశ్చకార సః || 69

ఇత్థం చక్రే స దుర్వాసా విచిత్రం చరితం బహు | ధన్యం యశస్యమాయుష్యం శృణ్వతస్సర్వకామదమ్ || 70

య ఇదం శృణుయాద్భక్త్యా దుర్వాసశ్చరితం ముదా | శ్రావయేద్వా పరాన్ యశ్చ స సుఖీహ పరత్ర చ || 71

ఇతి శ్రీ శివమహాపురాణ  శతరుద్ర సంహితాయాం దుర్వాసశ్చరిత్రవర్ణనం నామై కోనవింశో%ధ్యాయః (19).

ఆయన చక్కని ఉపదేశమును బోధించి అనేక మందిని ఉద్ధరించెను. ఆయన విశేషించి అనేకమందికి జ్ఞానమును ఇచ్చి వారిని ముక్తులను చేసెను (69). ఈ విధముగా ఆ దూర్వాస మహర్షి అనేకములగు విచిత్ర చరితములను ప్రకటించెను. ఈ చరిత్ర పవిత్రమైనది, యశస్సును ఆయుర్దాయమును మాత్రమే గాక వినువారికి కోర్కెలనన్నిటినీ ఇచ్చును (70). ఎవరైతే ఈ దూర్వాస చరితమును భక్తితో ఆనందముతో వినునో, లేదా ఇతరులకు వినిపించునో, ఆతడు ఇహపర లోకములలో సుఖమును బడయును (71).

శ్రీ శివ మహాపురాణములోని శతరుద్రసంహితయందు దుర్వాసచరితమనే పందొమ్మిదవ అధ్యాయము ముగిసినది (19).